శ్లోకము భగవన్ముఖేరితము కాన దీని నందఱు నధ్యయనింప వలెనని భావించిరి. అప్పటినుండి వడగల తెంగల సాంప్రదాయకు లిర్వురును దీనిని పఠించుట కొప్పిరి.

ఈవిధముగా వేదాంత దేశికు లీభూమిపై నూటరెండు సంవత్సరముల కాలము జీవించియుండిరి. జీవిత చరమాంకమున

"నిర్విష్టం యతి సార్వభౌమ వచసా మావృత్తిభి ర్యావనమ్
నిర్ధూ తేతర పారతంత్ర్య నిరయా నీతాస్సుఖం వాసరాః
అంగీకృత్య సతాం ప్రవృత్తి రసతాం గర్వోపి నిర్వాపితః
శేషాయుష్య వి శేష దంపతి దయా దీక్షాముదీక్షా మహే"

యతిసార్వభౌములగు రామానుజుల శ్రీభాష్యమున నధ్యయనించుచు నాయౌవనము గడచినది. భగవద్భాగవత వ్యతికరజన విషయపారతంత్ర్య నిరయనిరసనపూర్వకముగా దినములు గడచిపోయినవి. సత్పురుషుల కనుకూలముగా దుష్టులగు పండితుల గర్వమంతయు నిరసింపబడినది. ఇక మిగిలిన కాలమంతయును సర్వశేషి దంపతుల దయకెదురు చూచుచున్నా"మని చెప్పుచు, గురుని శ్రీపాదములు తలంచుచు శ్రీరామానుజుల పదపద్మంబులు స్మరించుచు, వైభవమును చాలించెను.

వేదాంత దేశికుల పుత్రుండగు వరదాచార్యుండు తండ్రికి బ్రహ్మమేధాదిక్రియల నన్నింటిని నిర్వర్తించి సుఖంబుండెను.

వేదాంత దేశికులు రచించిన గ్రంథములు శతాధికములుగానున్నవి. ఆ గ్రంథములన్నియు నేడు లభించుటలేదు.

పాదుకాసహస్రమునందలి యొక శ్లోకము నుదహరించు
ముగించుచున్నాను.

శ్లో॥ పాదపా పాదపా పాదపా పాదపా
పాదపా పాదపా పాదపాఽపాదపా
పాదపా పాదపా పాదపా పాదపా
పాదపా పాదపా పాదపాఽపాదపా

ఓమ్ శచ్ఛాంతిః శచ్ఛాంతిః శచ్ఛాంతిః

స మా ప్త ము

